OPPONENT : పోటీదారు, ప్రత్యర్థి.
The *opponent* withdrew from competition.
పోటీదారు పోటీ నుండి విరమించుకునిరి.

8. ANTAGONIST : శాశ్వత శత్రుత్వము
Cat and rat are *antagonists* by nature.
పిల్లి ఎలుకలు సహజంగా శాశ్వత శత్రువులు.

ALSO : అదికాక వేరొకటి కూడా
Srinu *also* went along with them.
వారితో శ్రీను కూడా వెళ్ళాడు.

BESIDES : దాని ప్రక్కనే, మరొకటి
Hotel is *beside* the cinema hall.
సినిమా హాలు ప్రక్కనే హోటలు ఉన్నది.

LIKEWISE : ఒకేలాగా, సమభావం కలిగిన
Kamalhassan is a great actor *likewise* he is a good dancer.
కమల్‌హాసన్ మంచి నటుడే కాక, చక్కని నృత్యకారుడు.

9. ALONE : ఒకటి, ఒక్కడే
Bhima *alone* completed the entire work.
భీముడు ఒక్కడే పనినంతా పూర్తి చేశాడు

LONELY : ఒంటరిగా
Gowri went guntur *lonely.*
గౌరి ఒంటరిగా గుంటూరు వెళ్ళింది.

SOLELY : పూర్తిగా ఒకరికి చెందిన
He took the responsibility *solely.*
అతను పూర్తిగా బాధ్యత తీసుకున్నాడు.

10. ASS : అడ్డగాడిద
Don't talk as an *Ass.*
అడ్డగాడిదవలె మూర్ఖముగా మాట్లాడకు.

DONKEY : గాడిద
*Donkeys* are in group.
గాడిదలు గుంపుగా ఉన్నవి.

11. ADMIT : ఒప్పుకొను, అంగీకరించు
The student barely *admitted* his mistake.
విద్యార్థి తన తప్పును నేరుగా అంగీకరించెను.

CONFESS : తప్పును అంగీకరించుట, పాపక్షమాపణ కోరుట
He *confessed* to God in the church.
అతడు తన పాపమును క్షమింపుమని చర్చిలో దేవుని వేడుకొనెను.

12. ADVANCE : ముందుకు వెళ్ళు
The ship is *advancing* in the sea with 100 miles speed.
ఓడ వందమైళ్ళ వేగంతో సముద్రంలో ముందుకు సాగుతోంది.

ADVANCEMENT : వృద్ధి, ఉన్నతి
This status is a proof of his *advancement.*
ఈ హోదా అతని వృద్ధికి నిదర్శనం.

13. ANSWER : జవాబు
This question has no *answer.*
ఈ ప్రశ్నకు సమాధానం లేదు.

REPLY : ప్రత్యుత్తరమిచ్చు
Kiran *replied* immediately to the letter of Madhav.
మాధవ్ ఉత్తరానికి కిరణ్ ప్రత్యుత్తరం వెంటనే ఇచ్చాడు.

14. ADVANTAGE : సానుకూలత, లాభదాయకమైన
This is *advantageous* time for crops.
పంటలకు ఇది అనుకూలమైన సమయం.

BENEFIT : లాభం, ప్రయోజనం
He speaks only when there is some *benefit.*
ఏదైనా ప్రయోజనం ఉంటేనే అతను మాట్లాడతాడు.

15. ACCOMPLISH : సాధించు, నెరవేర్చు.
Overcoming poverty my friend *accomplished* self abundance.
పేదరికమును అధిగమించి నా మిత్రుడు స్వయం సమృద్ధి సాధించెను.

ACHIEVE : పొందు, సాధించెను.
Sailesh *achieved* first rank by hard study.
కష్టపడి చదివి శైలేష్ మొదటి శ్రేణి పొందాడు.

GAIN : లాభం, సంపాదించు
Good friends are *gained* by demeanor.
సత్ప్రవర్తన వల్ల మిత్రులను సంపాదించవచ్చు.

16. FULFILL : పూర్తిచేయు, తీర్చు
All his requirements *fulfilled* by the father.
తండ్రి అతని అవసరాలన్నీ తీర్చాడు.

PERFORM : చేయు, నిర్వహించు
They *performed* the given duty efficiently.
వారు ఇచ్చిన పనిని సమర్థవంతంగా నిర్వహించిరి.

17. ACCURATE : ఖచ్చితమైన
*Accurate* analysis of elections is required.
ఎన్నికలయొక్క ఖచ్చితమైన విశ్లేషణ కావాలి.

CORRECT : సరియైన
Tell the *correct* answer to my question.
నా ప్రశ్నకు సరియైన సమాధానం చెప్పు.

EXACT : యధాతథంగా
She knows *exactly* what happened.
యధాతథంగా ఏం జరిగిందో ఆమెకు తెలుసు.

PRECISE : ఖచ్చితమైన
*Precise* information is needed.
ఖచ్చితమైన సమాచారం అవసరం.

18. ANTIQUATED : పురాతనమైన
Many *antiquated* things are at the museum.
వస్తు ప్రదర్శనశాలలో చాలా పురాతనమైన వస్తువులు ఉన్నవి.

AGED : వృద్ధుడు, వృద్ధత్వం
*Aged* people are having shelter in old age home.
వృద్ధాశ్రమంలో వృద్ధులు ఆశ్రయం పొందుతున్నారు.

ANCIENT : ప్రాచీనమైన
Our *ancient* culture is very great.
మన ప్రాచీన సంస్కృతి చాలా గొప్పది.

19. AGREE : అంగీకరించు
He *agreed* my opinion.
అతను నా అభిప్రాయం అంగీకరించాడు.

CONCUR : సమ్మతించు
It is not possible to *concur* all conditions.
అన్ని షరతులూ సమ్మతించుట సాధ్యం కాదు

ACCEPT : అంగీకరించు, ఒప్పుకొను
He *accepted* to go instead of me.
నా బదులుగా అతను వెళ్లడానికి ఒప్పుకున్నాడు.

20. ALIEN : విదేశీయుడు
*Aliens* are more in this place.
విదేశీయులు ఈ ప్రాంతములో అధికంగా గలరు.

FOREIGN : విదేశము
England is *foreign* country to us.
ఇంగ్లండు మన దేశానికి విదేశము.

STRANGE : కొత్త, వింత
A *strange* thing for a day is happening.
రోజుకొక వింత జరుగుచున్నది.

21. ALTERNATE : వరుసలో ఒక దానిని విడిచి మరొకటి
*Alternate* day fever as a symptom for malaria.
రోజు విడిచి రోజు జ్వరం వచ్చుట మలేరియా లక్షణం.

ALTERNATIVE : మరోదారి, వేరే మార్గం.
He has to choose an *alternative* profession.
అతను మరొక వృత్తిని ఎంచుకోవాల్సి వుంది.

22. ALL : అన్నీ, అంతా
Human beings *all* are equal.
మనుషులంతా ఒక్కటే.

WHOLE : మొత్తం
The *whole* class was silent.
తరగతి అంతా నిశ్శబ్దంగా ఉంది.

ENTIRE : పూర్తిగా
*Entire* the city is the darkness.
నగరం పూర్తిగా చీకటిలో వుంది.

TOTAL : మొత్తం
Calculate the *total* of the numbers.
సంఖ్యల మొత్తాన్ని లెక్కవేయుము.

23. ALLUDE : సూచించు, ఉదహరించు
I *alluded* him an instance from Ramayana.
నేన అతనికి రామాయణంలో ఒక సన్నివేశాన్ని సూచించాను.

REFER : సూచించు
The clerk *referred* to meet principal.
ప్రిన్సిపాల్‌ను కలవమని గుమాస్తా సూచించాడు.

24. APPARENT : స్పష్టమైన
It is *apparently* visible scene.
ఇది స్పష్టంగా కనబడుతున్న దృశ్యం.

EVIDENT : ప్రత్యక్షమైన, స్పష్టమైన
This is an *evident* fact.
ఇది ఒక ప్రత్యేకమైన నిజం.

25. ARTIST : కళాకారుడు
Ravivarma is a great *artist.*
రవివర్మ గొప్ప కళాకారుడు.

ARTISAN : చేతి పనివాడు
Black smith is a an *artisan.*
కుమ్మరి ఒక చేతి పనివాడు.

26. ASSENT : అనుమతి
The Chief Minister has given an *assent* to road tax.
రహదారి పన్నుకు ముఖ్యమంత్రి అనుమతినిచ్చారు.

CONSENT : అంగీకారం, సమ్మతి
I took *consent* from the officer to take this file to home.
నేను ఈ ఫైల్ తీసుకువెళ్ళడానికి అధికారి అంగీకారం తీసుకున్నాను.

27. ASTONISHED : ఆశ్చర్యము పొందు
Feets in circus *astonished* the children.
సర్కస్‌లో విన్యాసాలు పిల్లలను ఆశ్చర్యపరిచాయి.

SURPRISED : విస్మయం కలిగించు
I *surprised* with his words.
అతని మాటలకు నేను విస్మయపడ్డాను.

28. AUDIENCE సభలోనివారు, శ్రోతలు
*Audience* gathered at one place for news.
శ్రోతలు వార్తల కోసం ఒక చోట చేరారు.

SPECTATOR : వీక్షకులు
*Spectators* enjoyed the drama.
నాటకమును వీక్షకులు ఆనందించారు.

29. AVENGE : ప్రతీకారము
People took *avenge* on cruel king.
క్రూర రాజుపై ప్రజలు ప్రతీకారం తీర్చుకున్నారు.

REVENGE : పగ తీర్చుకొను (వ్యక్తిగతమైన)
He had takens on his enemy.
అతను తన శత్రువుపై పగ తీర్చుకొన్నాడు.

30. AVOID : తప్పించు, లేకుండా చూచు
Mistakes can be *avoided* by proper plan.
సరియైన ప్రణాళిక ద్వారా తప్పులను తప్పించవచ్చును.

PREVENT : నివారించు, ఆపు
*Prevention* is better than cure.
చికిత్సకన్నా నివారణ మంచిది.

## 3

31. BANISH : బహిష్కరించు
Salmon Rashidi was *banished* from his country.
సాల్మన్ రష్డీ తన దేశం నుండి బహిష్కరించబడ్డాడు.

EXILE : వెడలగొట్టు, బహిష్కరించు
The criminal *exiled* from the country.
నేరస్థుడు దేశమునుండి పారిపోయెను.

BAN : నిషేధించు
Smoking is *banned* in railway stations.
రైల్వేస్టేషన్స్‌లో పొగ త్రాగుట నిషేధించబడెను.

32. BATH : స్నానము
I *bath* with hot water.
నేను వేడి నీటితో స్నానం చేస్తాను.

BATHE : నది లేక సముద్ర స్నానము
*Bathe* in the sea is joyful.
సముద్రస్నానము ఆహ్లాదకరంగా ఉంది.

33. BEAUTIFUL : స్త్రీ సౌందర్యము, అందము
She is *beautiful* woman.
ఆమె చాలా అందమైన స్త్రీ.

HANDSOME : పురుష సౌందర్యము
Rama is *handsome* among them.
రాముడు పురుషులలో అందమైనవాడు.

PRETTY : ముఖ సౌందర్యము
She smiled with a *pretty* face.
ఆమె అందముగా నవ్వేను.

FAIR : స్వచ్ఛమైన సౌందర్యము
Sita is a *fair* lady.
సీత అందమైన వనిత.

LOVELY : అందమైన, చూచుటకు అందంగా వున్న
Football is *lovely* game.
ఫుట్‌బాల్ అందమైన ఆట.

34. BIG : పెద్దది
This box is *big.*
ఈ పెట్టె పెద్దది.

LARGE : విశాలమైన
We bought a *large* house.
మేము విశాలమైన ఇంటిని కొన్నాము.

HUGE : భారీ
Elephant is a *huge* animal.
ఏనుగు ఒక భారీ జంతువు.

35. BILL : చట్టము
Income *bill* is accepted by Parliament.
ఆదాయ చట్టమును శాసనసభ ఆమోదించినది.

ACT : చట్టరూపం
Apposition parties opposed the *Act.*
ఈ చట్టాన్ని ప్రతిపక్షాలు వ్యతిరేకించాయి.

36. BESTOW : ఇచ్చు
The rich man *bestowed* his money to poor.
ధనికుడు తన ధనాన్ని బీదలకు ఇచ్చాడు.

CONFER : ప్రదానము చేయు, బిరుదునిచ్చు
The president *conferred* 'Padmasri' to the artist.
అధ్యక్షులు కళాకారునికి 'పద్మశ్రీ' బిరుదునిచ్చారు.

DONATE : దానమిచ్చు, విరాళమునిచ్చు.
The boy *donated* all his money to the beggar.
ఆ బాలుడు తన డబ్బునంతా ముష్టివానికి దానం చేశాడు.

PRESENT : బహుమతినిచ్చు
I was *presented* first prize in songs.
నాకు పాటలలో మొదటి బహుమతి ఇచ్చారు.

37. BATTLE : యుద్ధము
The *battle* was terrible.
యుద్ధము భీకరముగా జరిగెను.

WAR : సంగ్రామము
*War* was occurred three times between India and Pakistan.
భారత్, పాకిస్థాన్‌ల మధ్య మూడు సార్లు సంగ్రామము జరిగెను.

38. BLUNDER : ఘోరమైన తప్పు
He did a *blunder.*
అతను ఘోరమైన తప్పు చేశాడు.

ERROR : పొరపాటు
*Errors* are corrected by the controlling officer.
పొరపాట్లను నియంత్రణాధికారి సరిచేశాడు.

LAPSE : లోపము
*Lapses* of the project should be watched carefully.
ఈ పథకములోని లోపములను జాగ్రత్తగా గమనించాలి.

MISTAKE : తప్పు
Making *mistakes* is natural.
తప్పులు చేయుట సహజం.




39. CANAL : కాలువ
The *canal* is full of water.
కాలువ నీటితో నిండి ఉంది.

CHANNEL : సహజమైన కాలువ
The English *Channel* is dangerous.
ఇంగ్లీషుకాలువ ప్రమాదకరమైనది.

40. CARCASS : జంతుకళేబరము
The tiger is dragging away the *carcass* of Deer.
లేడి కళేబరమును పులి ఈడ్చుకుపోవుచున్నది.

CORPSE : మానవ కళేబరము
*Corpse* is floating on the water.
నీటిలో మానవ కళేబరము తేలుతున్నది.

41. CHANGE : మారు, మార్చు
I *changed* my scooter.
నేను నా స్కూటరును మార్చాను.

ALTER : కొంచెం మార్చు
Serial of class students *altered.*
తరగతిలోని విద్యార్థుల వరుసక్రమం మారింది.

42. CLIMATE : వాతావరణం
The *climate* is cold.
వాతావరణం చలిగా ఉంది.

WEATHER : ఒక సమయంలో వాతావరణ స్థితి
The *weather* report is normal.
వాతావరణ నివేదిక సాధారణంగా ఉంది.

43. COLLEGUE : సహోద్యోగి
My *collegue* is a wise man.
నా సహోద్యోగి తెలివైనవాడు.

COLLABORATOR : సహరచయిత
I have no *collaborator* in book writing.
పుస్తక రచనలో నాకు సహరచయిత ఎవరు లేరు.

44. COMMON : సమానమైన, అందరికి చెందిన
The four portions have a *common* verandah.
నాలుగు వాటాలకు అందరికి చెందిన వరండా ఉంది.

MUTUAL : పరస్పరము
The two sport men should have *mutual* cooperation.
ఆటగాళ్ళు ఇద్దరి మధ్య పరస్పర సహకారం ఉండాలి.

45. COMMONLY : అందరికి చెందినది
All are *commonly* opposed the postponement of elections.
ఎన్నికలు వాయిదా వేయడాన్ని అందరూ వ్యతిరేకించారు.

GENERALLY : సామాన్యంగా
*Generally* everybody shows compassion on blind fellows.
సామాన్యంగా అంధులపట్ల జాలి చూపుతారు.

46. COMPARE : పోల్చు
Poor should not *compare* with rich.
ధనికులతో పేదవారు పోల్చుకోరాదు.

CONTRAST : వైరుధ్యము, వ్యత్యాసము
Much *contrast* is there between the two.
వారిద్దరి మధ్య చాలా వ్యత్యాసము కలదు.

47. COMPRISE : ఇముడ్చుకొను
Tortoise *comprises* its feet into the stomach.
తాబేలు తన కాళ్ళనుపొట్టలో ఇముడ్చుకొంటుంది.

COMPOSE : కొన్ని కలిసి ఒక్కటిగా చేరు
The liquid is *composed* by many chemicals.
ఈ ద్రావకము చాలా రసాయనములతో తయారయ్యెను.

COMPREHEND : గ్రహించు, పూర్తిగా తెలుసుకొను
I cannot *comprehend* the ideas in your mind.
నీ మనసులో భావాన్ని నేను పూర్తిగా గ్రహించలేను.

48. CONGENIAL : సహజమైన, అనుకూలమైన
This time is *congenial* by all means.
ఈ సమయం అన్ని విధాల అనుకూలమైనది.

GENIAL : ప్రసన్నమైన, అనుకూలమైన
*Genial* behaviour of the officer surprised all.
అధికారి ప్రసన్నమైన ప్రవర్తన అందరికి ఆశ్చర్యము కలిగించినది.

49. CALAMITY : విపత్తు
Floods and earthquakes are natural *calamities*.
వరదలు, భూకంపములు ప్రకృతి సిద్ధమైన వైరీత్యాలు

CATASTROPHE : మహా ఆపద
A *catastrophe* destroyed the family.
ఒక మహా ఆపద ఆ కుటుంబాన్ని నాశనం చేసింది.

DISASTER : అనర్థం
Great *disaster* is about to happen.
గొప్ప అనర్థం జరగబోతున్నది.

MISFORTUNE : దురదృష్టం
Failing in exam is really my *misfortune*.
పరీక్ష తప్పడం నిజంగా నా దురదృష్టం.

50. CAUSE : కారణము (ప్రధానమైన)
Ponds were dried up because of draught.
కరువు కారణంగా చెరువులు ఎండిపోయాయి.

REASON : హేతువు (ఇక్కడ ఫలితం ప్రధానమైనది)
*Reason* for his success is hard work.
అతని విజయానికి హేతువు కష్టించి పనిచేయడం.

51. CRIME : చట్టమును ఉల్లఘించే నేరము
Demanding bribe is a *crime.*
లంచము అడుగుట నేరము.

OFFENCE : న్యాయము కానిది, నేరము
He made an *offence* by giving wrong information to police.
పోలీసులకు తప్పుడు సమాచారం ఇచ్చి అతడు నేరం చేశాడు.

SIN : పాపము
Untouchability is a great *sin.*
అంటరానితనము మహా పాపము.

52. CONSCIOUS : స్మృతి, అంతరాత్మ
My *conscious* will not permit to make a crime.
నేరం చేయడానికి నా అంతరాత్మ ఒప్పుకోదు.

AWARE : తెలిసియున్న, అవగాహన కలిగి వుండు.
He is *aware* of what is going to be happened.
ఏం జరగబోతోందో అతనికి అవగాహన వుంది.

53. CONTINUOUS : కొనసాగుట, ఆపకుండా
Aruna was *continuously* speaking.
అరుణ ఆపకుండా మాట్లాడుతూనే వుంది.

CONTINUAL : పలుమార్లు
I *continually* gone for Eluru in this week.
నేను ఈ వారంలో పలుమార్లు ఏలూరు వెళ్ళాను.

54. CUSTOM : ఆచారము
Arranging dinner for guests in marriage is a *custom.*
పెళ్ళిలో అతిథులకు విందును ఇచ్చుట ఒక ఆచారము.

TRADITION : సంప్రదాయము
Idol worship is a hindu *tradition.*
విగ్రహారాధన హిందూ సంప్రదాయము.

55. CUSTOMER : ఖాతాదారుడు
The shop is full of *customers.*
దుకాణము ఖాతాదారులతో నిండి వున్నది.

CLIENT : కక్షిదారు
The lawyer gave confidence to the *client.*
న్యాయవాది కక్షిదారుకు నమ్మకం కలిగించాడు.

PATIENT : రోగి
The *patient* was discharged from hospital.
ఆస్పత్రి నుండి రోగిని పంపారు.

## *D*

56. DECIDED : నిశ్చయించు
He *decided* to give advise to them.
అతను వాళ్ళకి సలహా ఇవ్వడానికి నిశ్చయించాడు.

DECISIVE : నిర్బంధ నిశ్చయం
The officer's opinion is *decisive.*
అధికారి నిర్ణయం నిశ్చయమైయున్నది.

57. DECIMATE : పదోవంతు నాశనం అయింది.
The house was *decimated* by cyclone.
తుఫాను వల్ల ఇల్లు పదోభాగం నాశనం అయింది.

ANNIHILATE : రూపుమాపు, ధ్వంసం చేయు
Heroshima & Nagasaki cities were *annihilated* by atom bomb.
బాంబువల్ల హిరోషిమా నాగసాకి నగరాలు పూర్తిగా ధ్వంసం అయ్యాయి.

58. DECREASE : తగ్గిపోవు
Rupee value is *decreasing* day by day.
రూపాయి విలువ రోజురోజుకు తగ్గిపోతోంది.

DIMINISH : క్రమంగా తగ్గు
Fever is in *diminishing* phase.
జ్వరం క్రమంగా తగ్గు ముఖంలో ఉంది.

59. DEFEND : తక్షణ ప్రమాదం నుండి రక్షించు
Police *defended* the belongings from theft.
వస్తువులు చోరీకి గురి కాకుండా పోలీసులు రక్షించారు.

PROTECT : రక్షించు, సంరక్షించుకొను
Poor were *protected* in orphanage.
బీదలు అనాధ శరణాలయంలో సంరక్షించబడ్డారు.

60. DEFICIENT : కొరత
Calcium is *deficient* in his body.
అతని శరీరములో సున్నము లోపించినది.

DEFECT : లోపము
Not preparing for exam is your *defect.*
పరీక్షకు తయారు కాకపోవుట నీ లోపము

61. DENY : నిరాకరించు, ఖండించు
I *denied* his proposal.
అతని ఒడంబడికను నేను నిరాకరించాను.

REFUSE : తిరస్కరించు
He *refused* copying.
కాపీ కొట్టడాన్ని అతను తిరస్కరించాడు.

62. DEPRECATED : విలువ తగ్గించు, నిందించు
The principal *deprecated* him among public.
పదిమందిలో అతనిని ప్రిన్సిపాల్ నిందించారు.

DEPRECIATE : విలువ తగ్గడం
Calculate the *depreciation* value of machines.
యంత్రముల విలువ ఎంత తగ్గిందో లెక్కించండి.

63. DESTINY : విధి, ప్రారబ్ధం
*Destiny* plays major role in life.
జీవితంలో విధి బలమైన పాత్ర పోషిస్తుంది.

FORTUNE : అదృష్టము
He is *fortune* enough to get collector post.
కలెక్టరు ఉద్యోగము అతనికి దొరకటం అదృష్టము

64. DEVOTED : అంకిత భావము, అంకితమిచ్చు
Gandhiji *devoted* his life for freedom of India.
గాంధీగారు భారతదేశ స్వతంత్ర్యమునకై జీవితము అంకితమిచ్చారు.

ADDICT : వ్యసనమునకు లోబడు
She is *addicted* to drugs.
ఆమె మత్తుమందుల వ్యసనానికి లోనయింది.

65. DISCRIMINATE : తారతమ్యము చూపు, బేధము చూపు
He can *discriminate* between good and bad.
అతనికి మంచి చెడుల మధ్య భేదము బాగుగా తెలియును.

DISTINGUISH : విభేదము చూపు, వర్గీకరించు
It is easy to *distinguish* the Cat and Tiger.
పిల్లి, పులుల మధ్య భేదము తెలుసుకొనుట చాలా సులభము.

66. DIVERSE : విభిన్నమైన
They have *diverse* opinion of democracy.
ప్రజాస్వామ్యము మీద వారికి భిన్నమైన అభిప్రాయమున్నది.

DIVERS : ఒకరకములైన
*Divers* gift articles are there in the show room.
ఆ దుకాణములో రకరకములైన బహుమతులనిచ్చు వస్తువులున్నవి.

67. DOUBT : అనుమానము
He *doubted* her.
అతను ఆమెను అనుమానించాడు.

SUSPECT : అపనమ్మకము
I *suspect* whether the answer is correct or wrong.
ఈ జవాబు సరియైనదా కాదా అని నా అనుమానము.

68. DROP : చుక్క, ద్రవపు చుక్క, నీటి చుక్క.
Water is falling *drop* by *drop* from the tap.
కుళాయి నుండి నీరు చుక్కలు చుక్కలుగా పడుచున్నది.

PARTICLE : ముక్క (ఘన పదార్థానికి సంబంధించినది)
This is a *particle* from Iron.
ఇది ఒక ఇనుప ముక్క.

69. DROWN : మునిగిపోయిన
(సాధారణముగా వస్తువులకు అన్వయించును)
The child was *drowned* in the river.
ఆ పిల్లవాడు నదిలో మునిగిపోయాడు.

SINK : మునిగిపోవు
The Titanic ship was *sank* in the sea.
టైటానిక్ సముద్రంలో మునిగిపోయెను.

## E

70. EFFECTIVE : ప్రభావవంతమైన
Conducting instant exams is an *effective* deed.
తక్షణ పరీక్షలు నిర్వహించుట ప్రభావము చూపు చర్య.

EFFECTUAL : ప్రభావము చూపిన, ఫలితము ఇచ్చిన
The head master took *effectual* step on students.
విద్యార్థులు సరిగా తరగతులకు హాజరు కావడానికి ప్రధానోపాధ్యాయులు సరియైన చర్యలు తీసుకున్నారు.

71. EMPHATICALLY : గట్టిగా, స్థిరముగా
She was *emphatically* refused to tell a lie.
అబద్ధమాడుటకు ఆమె గట్టిగా నిరాకరించింది.

UNDOUBTEDLY : అనుమానం లేకుండా
*Undoubtedly* this sum is correct.
అనుమానం లేకుండా ఈ లెక్క సరియైనది.

72. ENVY : ఈర్ష్య
It is improper to be *envy* on neighbours.
ప్రక్కవారిని చూసి ఈర్ష్యపడుట తగదు.

JEALOUSLY : అసూయ
Some of my colleagues were *jealous* on my promotion.
నా పదోన్నతిని చూసి సహోద్యోగులలో కొందరు అసూయ చెందారు.

73. EVACUTED : సామూహికంగా ఖాళీ చేయు
People *evacuted* that place due to floods.
వరదవల్ల ప్రజలు ఆ ప్రదేశాన్ని ఖాళీ చేశారు.

VACATE : వ్యక్తిగతంగా ఖాళీ చేయు
We *vacated* the house near by the medical shop.
మేము మందుల షాపు వద్దగల ఇంటిని ఖాళీ చేశాము.

74. ECONOMIC : ఆర్థిక సంబంధమైన
The new *economic* strategy was praised by all.
కొత్త ఆర్థిక సంబంధమైన వైఖరి అందరిచే ప్రశంసించబడినది.

ECONOMICAL : పొదుపుగా
I will be *economical* in all subjects.
అన్ని విషయాలలోను నేను పొదుపుగా ఉంటాను.

ECONOMICS : ఆర్థిక శాస్త్రం
He is *economics* lecturer.
ఆయన ఆర్థిక శాస్త్ర ఉపన్యాసకుడు

ECONOMY : ఆర్థిక వ్యవస్థ
Our *economy* is in slump.
మన ఆర్థిక వ్యవస్థ మాంద్యాన్ని కలిగి ఉంది.

75. EVIDENCE : సాక్ష్యం
There is *evidence* to say that he did a crime.
అతను నేరం చేశాడనడానికి సాక్ష్యం ఉంది.

PROOF : ఋజువు
There is no *proof* for his statement.
అతను చెప్పిన విషయానికి ఋజువు లేదు.

PROVE : ఋజువు చేయు
I can *prove* that I am a student of this college.
నేను ఈ కళాశాల విద్యార్థిని అని నేను ఋజువు చేయగలను.

TESTIMONY : సాక్ష్యము
The judge dismissed the case due to the weakness in *testimony*.
సాక్ష్యము బలహీనముగా వుండటంవల్ల న్యాయమూర్తి కేసు కొట్టేశారు.

76. EVERYONE : ప్రతి ఒక్కడు
*Everyone* should bring a rose tomorrow.
రేపు ప్రతి ఒక్కరూ ఒక గులాబి పువ్వు తేవాలి.

EVERYONE : అందరూ
*Everyone* were silent.
అందరూ నిశ్శబ్దంగా ఉండిరి.

77. EXPECT : ఆశించు
Children are *expecting* sweets.
పిల్లలు మిఠాయిని ఆశిస్తున్నారు.

SEEK : కోరుట, అడుగుట
I am *seeking* your advice.
నేను మీ సలహాని కోరుతున్నాను.

ANTICIPATE : ముందే ఆశించు, ఎదురుచూచు
All are *anticipating* the positive opinion of the principal.
ప్రిన్సిపాల్‌గారి సానుకూల అభిప్రాయంకోసం అందరూ ఎదురుచూస్తున్నారు.

78. EXPIRE : మరణించు
The peon was *expired* due to diabetes.
ప్యూను షుగరు వ్యాధితో మరణించాడు.

DECEASE : పరమపదించు
The *deceased* man has no wife.
పరమపదించిన వ్యక్తికి భార్య లేదు.

LATE : స్వర్గీయ, కీర్తిశేషులు
Saran is son of *late* Seshagiri Rao.
శరణ్ కీర్తిశేషులు శేషగిరిరావు గారి కుమారుడు.

79. EXTENDED : పొడిగింపబడిన
Holidays were *extended.*
శలవులు పొడిగింపబడినవి.

PROLONGED : పెంచు
He has *prolonged* hair.
అతనికి బాగా పెంచబడిన జుట్టు ఉంది.

80. EXTENSIVE : విస్తారమైన, విపులమైన
*Extensive* efforts have been made to find out the missed man.
తప్పిపోయిన మనిషిని వెతుకుటకు విస్తారమైన ప్రయత్నాలు జరిగాయి.

VAST : విశాలమైన, సుదీర్ఘమైన
We have a *vast* house.
మాకు విశాలమైన ఇల్లు కలదు.

81. EXHAUSTIVE : సంపూర్ణమైన
*Exhaustive* information is available at library.
గ్రంథాలయంలో సంపూర్ణమైన సమాచారం దొరుకుతుంది.

TOTAL : పూర్తి, మొత్తం
They are *total* ten members.
వారు మొత్తం పదిమంది వున్నారు.

ENTIRE : అంతా, సమగ్రమైన
*Entire* city is celebrating joyful function.
నగరమంతా ఆనందోత్సవాలు జరుపుకుంటోంది.

WHOLE : మొత్తం (ఒకే వస్తువు, ప్రదేశానికి చెందిన మొత్తం)
The *whole* class is silent.
తరగతి మొత్తం నిశ్శబ్దంగా ఉంది.

82. EVENT : సంఘటన
I cannot forget that *event* in my life.
ఆ సంఘటన నా జీవితంలో మర్చిపోలేను.

OCCASION : సందర్భం
I invited all on the *occasion* of my marriage.
నా వివాహ సందర్భంగా అందరినీ ఆహ్వానించాను.

83. EXCEED : అతిక్రమించు
He *exceeded* the rules.
అతడు నిబంధనలను అతిక్రమించాడు.

EXCEL : అధిగమించు
To *excel* P.T.Usha in running is difficult.
పి.టి.ఉషను పరుగులో అధిగమించడం కష్టం.

ENCROACH : దురాక్రమణ, అక్రమ ఆక్రమణ
To *encroach* others land is a crime.
ఇతరుల స్థలాన్ని ఆక్రమించుకొనుట నేరం.

84. EXCEEDING : దాటుట, అతిక్రమించుట, పెంచు
He *exceeded* his competitors in business.
అతను వ్యాపారంలో తన ప్రత్యర్థులను అధిగమించాడు.

EXCESSIVE : ఎక్కువ, కావల్సినదానికంటే అధికంగా
We are having *excessive* staff.
మాకు కావలసిన దానికన్నా అధికంగా సిబ్బంది ఉన్నారు.

85. EXCEPTIONAL : అసాధారణమైన
It is an *exceptional* case.
అది అసాధారణమైన సంగతి.

STRANGE : వింతైన
A *strange* monkey is wandering in Delhi.
ఢిల్లీలో వింతైన కోతి తిరుగుతోంది.

86. EXCUSE : మన్నించుట
Please *excuse* his mistake.
అతని తప్పును మన్నించండి.

FORGIVE : క్షమించుట
*Forgiveness* is the ornament for man.
క్షమించుట మనిషికి భూషణము.

PARDON : క్షమాభిక్షనిడు, క్షమించు
The God *pardons* one who realised his sin.
దేవుడు అతని పాపములను క్షమించును.

87. EXPECT : ఆశించు
Don't *expect* that I will give the book.
నా పుస్తకం ఇస్తానని భావించకు.

HOPE : ఆశ, ఆశించు
I *hope* you will come.
నువ్వు వస్తావని ఆశిస్తాను.

88. EXPENDITURE : ఖర్చు
Home *expenditure* has grown too much.
కుటుంబ ఖర్చు బాగా పెరిగిపోయింది.

EXPENSE : చిల్లర ఖర్చు
Travelling *expense* will be given by the college.
ప్రయాణపు ఖర్చు కాలేజీ వాళ్ళే ఇస్తారు.



89. FALSEHOOD : అసత్యము
The principal cursed him for his *falsehood*
అసత్యము చెప్పాడనేకారణంగా ప్రిన్సిపాల్ అతనిని తిట్టారు.

LIE : అబద్ధము
Don't tell a *lie.*
అబద్ధము చెప్పకు.

90. FAMOUS : ప్రసిద్ధి చెందిన
Kashmir is *famous* for apples.
కాశ్మీరు ఏపిల్ పండ్లకు ప్రసిద్ధి చెందినది.

RENOWN : ప్రఖ్యాతిగాంచిన
Jaipur is a *renowned* city.
జైపూర్ ప్రఖ్యాతి గాంచిన నగరము.

91. NOTED : ప్రసిద్ధి చెందిన
She is well *noted* social worker.
ఆమె ప్రసిద్ధి చెందిన సంఘ సేవకురాలు.

FATAL : చంపేటంత తీవ్రత
The flood is *fatal.*
వరద మహాతీవ్రంగా ఉంది.

FEROCIOUS : క్రూర జంతువు
Tiger is a *ferocious* animal.
పులి అతి క్రూర జంతువు.

92. FLOCK : గొర్రెల మంద
Hundred sheeps are there in the *flock.*
గొఱ్ఱెల మందలో వంద గొఱ్ఱెలు ఉన్నవి.

HERD : మంద, గుంపు
*Herd* of elephants is beautiful.
ఏనుగుల మంద అందముగా ఉంది.

93. FOREBEAR : పూర్వీకులు
Our *forebears* are from Vijayanagaram.
మా పూర్వీకులు విజయనగరానికి చెందినవారు.

ANCESTOR : పూర్వీకుడు
Monkey is the *ancestor* for man.
కోతి మనిషికి పూర్వీకుడు.

ANCIENT : ప్రాచీనమైన
Our *ancient* culture is great.
మన ప్రాచీన సంస్కృతి చాలా గొప్పది.

94. FORT : కోట
Red *fort* is in Delhi.
ఎర్ర కోట ఢిల్లీలో ఉంది.

FORTE : ఆయువుపట్టు
Vibhishana knows the *forte* of Ravana.
విభీషణుడికి రావణుని ఆయువుపట్టు తెలుసు.

95. FREEDOM : స్వాతంత్ర్యము
Our *freedom* fight was peace oriented.
మన స్వాతంత్ర్య పోరాటము శాంతియుతమైనది.

LIBERTY : స్వేచ్ఛ
Every man need *liberty.*
ప్రతి వ్యక్తికీ స్వేచ్ఛ అవసరం.

96. **FUNERAL** : అంత్యక్రియ
Sandalwood was used in Minister's *funeral.*
మంత్రిగారి అంత్యక్రియలో గంధపుచెక్క వాడారు.

**UNREAL** : దుఃఖభరితమైన
The place is *unreal* withe the murder of the leader.
నాయకుని హత్యతో ఆ ప్రదేశమంతా దుఃఖభరితమై వుంది.

## *G*

97. **GENIUS** : మేధావి
Mathematician Ramanujam is a great *genius.*
రామానుజం అనే గణిత శాస్త్రజ్ఞుడు గొప్ప మేధావి.

**CLEVER** : తెలివిగల
Deepa is a *clever* student.
దీప తెలివిగల విద్యార్థిని.

98. **GOOD** : మంచి, న్యాయమైన
Honoring others is a *good* habit.
ఇతరులను గౌరవించుట మంచి లక్షణము.

**WELL** : బాగుగా వుండు, చక్కని
He is *well* settled in life.
అతను జీవితంలో చక్కగా స్థిరపడ్డాడు.

99. **GRACIOUS** : కరుణకల్గిన, దయామయత్వం
Jesus sees with *gracious* looks.
ఏసు కరుణార్ద్ర దృక్కులతో చూచును.

**GRACEFUL** : సుందరమైన, మనోహరమైన
Himalayas are *graceful* place.
హిమాలయములు మనోహరమైన ప్రదేశము.

## *H*

100. **HASTEN** : తొందరపెట్టు
They are *hastening* for journey.
ప్రయాణమునకై వారు తొందరపెట్టుచున్నారు.

HURRY : హడావడి, తొందర
We are in *hurry* to catch the train.
రైలు అందుకోవాలనే తొందరలో వున్నాము.

101. HEALTHFUL : ఆరోగ్యదాయకమైన
They take always the *healthful* food.
వారు ఎల్లప్పుడూ ఆరోగ్యాన్నిచ్చే ఆహారమే తీసుకుంటారు.

HEALTHY : ఆరోగ్యవంతమైన
Mine's is a *healthy* body.
నాది ఆరోగ్యవంతమైన శరీరము.

102. HEARTILY : సాదరముగా
The guest were *heartily* welcomed.
అతిథులు సాదరముగా ఆహ్వానింపబడిరి.

WHOLEHEARTEDLY : మనస్ఫూర్తిగా
*Whole heartedly* she accepted.
మనస్ఫూర్తిగా ఆమె ఒప్పుకుంది.

103. HISTORIC : చారిత్రకమైన
It is a *historic* construction.
ఇది ఒక చారిత్రక కట్టడం.

HISTORICAL : చరిత్రకు సంబంధించిన
The movie was made with *historical* background.
చారిత్రక నేపథ్యంలో ఆ చిత్రం నిర్మించారు.

104. HONORARY : గౌరవార్థకమైన, వేతనరహితమైన
He is *honorary* secretary to our organisation.
మా సంస్థకు ఆయన గౌరవ కార్యదర్శి.

HONORABLE : గౌరవనీయ
*Honorable* Prime Minister addressing the hall.
గౌరవనీయ ప్రధానమంత్రి సభనుద్దేశించి మాట్లాడుతున్నారు.




105. IMAGINARY : ఊహాత్మకమైన
Her fears are *imaginary.*
ఆమెవి ఊహాజనితమైన భయాలు.

ILLUSIONARY : భ్రమతో కూడిన
Men with *illusionary* thoughts cannot realise fact.
భ్రమలతో కూడిన ఆలోచనలు గలవారు వాస్తవం గ్రహించలేరు.

106. IMPLY : సూచించు
He *implied* that to take the help of police.
పోలీసుల సహాయం తీసుకోమని అతను సూచించాడు.

INFER : అంచనా
The coach *inferred* his capacity.
అతని సామర్ధ్యమును శిక్షకుడు అంచనా వేశాడు.

## K

107. KILL : చంపు
Rama *killed* Ravana.
రాముడు రావణుని చంపెను.

MURDER : హత్యచేయు
He was hanged for the cause of *murder*.
అతను హత్యచేసిన కారణంగా ఉరితీయబడ్డాడు.

ASSASSINATE : రాజకీయ హత్య
Rajiv Gandhi was *assassinated* by a human bomb.
రాజీవ్‌గాంధీ మానవబాంబు వల్ల హత్య చేయబడ్డాడు.

## M

108. MIDDLE : మధ్యలో
A red spot is in *middle* of the circle.
వృత్తమునకు మధ్యలో ఎర్ర చుక్క ఉన్నది.

CENTRE : ఖచ్చితంగా మధ్యలో
Distance between *centre* to circumference is 10 feet.
పరిధినుండి మధ్యకు దూరం పది అడుగులు.

## N

109. NAUGHT : ఏమీలేని, విఫలమైన
All my trails came to a *naught*.
నా ప్రయత్నాలన్నీ విఫలమయ్యాయి.

NOUGHT : సున్నా
Jamesbond's secret code is *Nought Nought* seven.
జేమ్స్‌బాండ్ రహస్య సంకేతం సున్నా సున్నా ఏడు.

110. NECESSITY : అవసరం
Job is *necessity* for him.
అతనికి ఉద్యోగం ఎంతో అవసరం.

NEED : అవసరం
I have not *need* of your help.
నాకు నీ సహాయం అవసరం లేదు.

111. NOMINATE : నియమించు
He was *nominated* as chairman to the language committee.
భాషా సంఘానికి ఆయన చైర్మన్‌గా నియమింపబడ్డారు.

DENOMINATE : బిరుదునిచ్చు
He is having the *denomination* 'Modern Karna'.
ఆయనకు 'ఆధునిక కర్ణుడు' అను బిరుదు కలదు.

112. NOTORIOUS : అపఖ్యాతి
He is a *notorious* man.
అతను చాలా చెడ్డవాడు.

IGNOMINY : అగౌరవం, అపఖ్యాతి
To bear *ignominy* is very difficult.
అగౌరవాన్ని సహించడం చాలా కష్టం.

113. NOXIOUS : అపాయకరమైన
Working in mines is a *noxious* job.
గనులలో పనిచేయటం అపాయకరమైన ఉద్యోగం.

OBNOXIOUS : హేయమైన, నీచమైన
He was suspended because of his *obnoxious* behaviour.
అతని నీచ ప్రవర్తన వల్ల ఉద్యోగంలో నిలిపివేయబడ్డాడు.




114. ORDER : ఆజ్ఞాపించు
This is my *order*.
ఇది నా ఆజ్ఞ.

COMMAND : సైనిక సంబంధమైన ఆజ్ఞ
The army will proceed according to the *command* of the chief.
ఉన్నతాధికారి ఆజ్ఞానుసారం సైన్యం ముందుకు సాగుతుంది.



115. PEACEFUL : ప్రశాంతమైన
This place is *peaceful.*
ఆ ప్రాంతం ప్రశాంతముగా ఉన్నది.

CALM : నిశ్శబ్దము, మౌనము
When the teacher entered, the entire class is *calm.*
ఉపాధ్యాయుని రాకతో తరగతి అంతా నిశ్శబ్ధంగా ఉంది.

PLACID : గంభీరమైన
He is *placid* like ocean.
ఆయన సముద్రమువలె గంభీరముగా ఉన్నాడు.

TRANQUIL : నిశ్చలమైన, స్థిరమైన, శాంతమైన
Ooty is a *tranquil* hill station.
ఊటీ ప్రశాంతమైన కొండ ప్రాంతము.

116. PASS : ఉత్తీర్ణత
I *passed* Engineering.
నేన ఇంజనీరింగ్‌లో ఉత్తీర్ణుడనయ్యాను.

VICTORY : విజయం
This *victory* gave me self-confidence.
ఈ విజయం నాకు ఆత్మ విశ్వాసాన్ని ఇచ్చింది.

WIN : గెలచుట
We *win* the match.
మేము ఆట గెలిచాము.

117. PATRON : పోషకుడు
Our chief *patron* is government.
మా ప్రధాన పోషకుడు ప్రభుత్వము.

NOURISH : పోషించు
Mother *nourishes* the child with milk.
తల్లి పాలతో బిడ్డను పోషించును.

118. **PERSUADE** : అంగీకరింపజేయు, ఒప్పించు
I *persuaded* my parents to join me in army.
నేను సైన్యంలో చేరటానికై తల్లిదండ్రులను అంగీకరింపజేశాను.

**CONVINCE** : ఒప్పించు
At last I *convinced* her to sing.
చివరకు ఆమెను పాడటానికి ఒప్పించాను.

119. **PERSECUTE** : వేధించు, హింసించు
She suffered with *persecution* in duty.
ఆమె విధి నిర్వహణలో వేధింపులకు గురయ్యింది.

**PROSECUTE** : విచారించు
Judge *prosecuted* him on the allegation of bribe.
లంచం తీసుకున్నాడనే అభియోగం మీద అతన్ని న్యాయమూర్తి విచారించారు.

120. **PLENTY** : సమృద్ధి
*Plenty* of apples are there for distribution.
పంచడానికి సమృద్ధిగా యాపిల్ పళ్ళు ఉన్నవి.

**ABUNDANT** : అపరిమితమైన
*Abundant* stock of food grains are available in country.
దేశంలో ధాన్యం నిల్వలు అపరిమితంగా వున్నాయి.

121. **POSSIBLE** : సాధ్యపడునట్టి
There is a *possibility* of rain in the evening.
సాయంత్రం వర్షం పడటానికి అవకాశం ఉంది.

**PROBABLE** : జరుగుటకు ఎక్కువ అవకాశం గల
*Probably* elections will be held in the present year.
ఈ సంవత్సరంలో ఎన్నికలు జరగడానికి ఎక్కువ అవకాశముంది.

122. **PRACTICAL** : ఆచరణాత్మకమైన, ఆచరణలో
The *practical* implementation of bookish knowledge is difficult.
పుస్తక విజ్ఞానాన్ని ఆచరణలో పెట్టడం కష్టం.

**PRACTICABLE** : ఆచరింపదగిన
Healing is a *practicable* profession.
వైద్య ఆచరింపదగిన వృత్తి.

123. PRIDE : గర్వము
He is *pride* of his victory.
అతను తన విజయానికి గర్వపడుతున్నాడు.

VANITY : స్వాతిశయము, అహంకారము
*Vanity* itself an ornament of Suneetha.
అహంకారమే సునీతకు అలంకారము.

124. PROPOSAL : ప్రతిపాదన
I *proposed* to complete the syllabus in early.
పాఠ్యప్రణాళిక ముందుగా పూర్తి చేయాలని నేను ప్రతిపాదించాను.

PROPOSITION : నిశ్చయించి చెప్పే ప్రకటన
The *proposition* told that cricket match will be held on sunday.
ఆదివారం క్రికెట్ మ్యాచ్ జరుగుతుందని ఆ ప్రకటన తెల్పింది.

## R

125. RARE : అరుదైన
Kohinoor is a *rare* diamond.
కోహినూర్ అరుదైన వజ్రము.

SCARCE : కొరత, లోపించిన
*Scarcity* of sugar is in our city.
మా నగరంలో చక్కెరకు కొరత వుంది.

126. REIGN : పరిపాలన
People were happy in the *reign* of Krishna Devaraya.
కృష్ణదేవరాయల పరిపాలనలో ప్రజలు సుఖంగా వున్నారు.

RULE : పరిపాలించు
Pridhviraj *ruled* Kanoj.
పృధ్వీరాజ్ కనోజ్‌ను పరిపాలించాడు.

GOVERN : అజమాయిషీ చేయు, అధికారముతో ఉండు
He *governed* the festival arrangements.
అతను ఉత్సవ ఏర్పాట్లను అజమాయిషీ చేశాడు.

127. RESIDENCE : నివసించు చోట
My *residence* is near by the college.
మా నివాసము కాలేజీ దగ్గరలో ఉంది.

HOUSE : ఇల్లు
The *house* was ruined.
ఆ ఇల్లు శిథిలమైపోయింది.

HOME : గృహము (మనుషులతో వున్న ఇల్లు)
I purchased some fruits for my *home.*
నేను నా ఇంటి కొరకు కొన్ని పళ్ళు కొన్నాను.

128. RECREATION : వినోద కాలాక్షేపం
*Recreation* bring outs man from stress.
వినోదకాలక్షేపం మనిషిని ఒత్తిడినుండి బయటికి తెస్తుంది.

ENTERTAINMENT : ఉల్లాసపరుచు, సంతోషపరిచే
Chaplin movies give good *entertainment* for people.
చాప్లిన్ సినిమాలు ప్రజలకు చక్కని ఆహ్లాదాన్నిస్తాయి.

AMUSEMENT : వినోదం (వ్యక్తిగతమైన)
Riding is a great *amusement* to me.
గుర్రపు స్వారి నాకు చక్కటి వినోదాన్నిస్తుంది.

129. REBELLION : తిరుగుబాటు
First *rebellion* in India against the Britishers was happened in the year 1857.
భారతదేశంలో బ్రిటిష్‌వారికి వ్యతిరేకంగా మొదటి తిరుగుబాటు 1857లో జరిగింది.

REVOLUTION : విప్లవం
Millions were killed in Russian *revolution.*
రష్యా విప్లవంలో లక్షలమంది చనిపోయారు.

REVOLT : తిరగబడు, తిరుగుబాటు
*Revolt* may come against military rule in Pakistan.
సైనిక పాలనకు వ్యతిరేకంగా పాకిస్థాన్‌లో తిరుగుబాటు రావచ్చును.

130. RECOLLECT : గుర్తుకు తెచ్చుకొను
I am *recollecting* past events.
పాత సంగతులను గుర్తు చేసుకుంటున్నాను.

REMEMBER : జ్ఞాపకం, గుర్తులో గల
His *remembrance* power is excellent.
అతని జ్ఞాపకశక్తి అద్భుతం.

131. REGRETFUL : విచారించు, బేధము
Sending Rama to forest is a highly *regretful.*
రాముడిని అడవులకు పంపడం అత్యంత విచారకరం.

SORROWFUL : విషాదభరితమైన
She wept after reading the *sorrowful* story.
విషాదభరితమైన కథ చదివి ఆమె ఏడ్చింది.

MISERABLE : దుఃఖభరితమైన
It is a *miserable* event that he met with an accident.
అతనికి ప్రమాదం జరగడం దుఃఖకరమైనది.

132. RELATION : బంధుత్వము, సంబంధము
He is our *relation.*
అతను మా బంధువు

ATTACHMENT : బంధము, అనురక్తి
I have an unknown *attachment* with the child.
ఆ పిల్లవానితో నాకు తెలియని బంధం వుంది.

133. RELINQUISH : వదులుకొను, విడిచిపెట్టు
He *relinquish* his job for a word.
అతను మాటకోసం ఉద్యోగాన్ని వదలుకొన్నాడు.

RENOUNCE : త్యాగముచేయు, పరిత్యజించు
Yogis *renounce* mendance pleasure.
యోగులు ఐహిక సుఖాలను త్యాగం చేస్తారు.

RESIGN : రాజీనామా చేయు
The Minister *resigned* due to political pressure.
రాజకీయ ఒత్తిడులకు లొంగి మంత్రి రాజీనామా చేశారు.

134. REMOVE : తీసివేయు
I *removed* the photo from the table.
బల్లమీద నుండి ఫోటోను నేను తీసివేశాను.

TERMINATE : తొలగించు (బలవంతంగా)
Government has *terminated* hundreds of employees from jobs.
వందలాది మంది ఉద్యోగులను ప్రభుత్వం ఉద్యోగాలనుండి తొలగించింది.

135. REPLY : జవాబు, బదులుగా
He *replied* to my question.
నా ప్రశ్నకు అతను బదులు చెప్పాడు.

RESPOND : ప్రత్యుత్తరమిచ్చు, స్పందించు
They *responded* to my appeal and granted me leave.
నా అభ్యర్థనకు స్పందించి నాకు సెలవు మంజూరు చేశారు.

ANSWER : జవాబు
This question has no correct *answer.*
ఈ ప్రశ్నకు సరైన జవాబు లేదు.

136. REPEL : తిరగగొట్టు, తరిమికొట్టు
We use mosquito coil to *repel* mosquitoes.
దోమలను తరిమికొట్టడానికి దోమల అగరబత్తి వాడతాం.

REPULSE : తిరస్కరించు
We have no *repulse* unlawful actions.
చట్టవిరుద్ధమైన చర్యలను మనం తిరస్కరించాలి.



137. SENSITIVE : సున్నితమైన
She is *sensitive* lady.
ఆమె సున్నితమైన స్త్రీ.

SMOOTH : మృదువైన
This cotton shirt is *smooth.*
ఈ ఖద్దరు చొక్కా సున్నితంగా ఉంది.

138. SENSUAL : ఇంద్రియ సంబంధమైన
*Sensual* pleasures should be voided.
ఇంద్రియ సుఖములనుండి దూరంగా ఉండాలి.

SENSIBLE : వివేకముగల
He took a *sensible* step.
అతను వివేకవంతమైన చర్య తీసుకున్నాడు.

SENSUOUS : ఇంద్రియములకు చెందిన
*sensuous* steability is necessary for man.
ఇంద్రియ నిగ్రహం మనిషికి అవసరం

139. SHADE : ఛాయ
He is sleeping under the *shade* of a tree.
అతను చెట్టు ఛాయలో నిద్రపోతున్నాడు.

SHADOW : నీడ
My *shadow* is bigger than me.
నా నీడ నాకన్న పెద్దగా ఉంది.

140. SALARY : జీతము (ఒక క్రమపద్ధతిలో ఇచ్చేది)
My *salary* comes in the form of a cheque.
నా జీతము చెక్కురూపంలో వచ్చును.

FEE : రుసుము
I paid my college *fee.*
నేను నా కాలేజీ రుసుము కట్టేశాను.

WAGE : దినభత్యము
He has not paid his *wage* from three days.
మూడురోజులుగా అతనికి దినభత్యము ఇచ్చుట లేదు.

STIPEND : శిక్షణ కాలంలో ఇచ్చే ప్రతిఫలం
I am doing doctorate on *stipend* basis.
నేన ప్రతిఫలం మీద డాక్టరేట్ చేస్తున్నాను.

141. SICK : జబ్బుపడు
He is *sick* from last one month.
అతను నెల రోజులుగా జబ్బుతో ఉన్నాడు.

ILL : అనారోగ్యం
The cause is unknown for his *ill.*
అతని అనారోగ్యమునకు కారణం తెలియదు.

INDISPOSED : ఆరోగ్యము సరిగా లేకుండుట
He is slightly *indisposed* by drinking polluted water.
కలుషిత నీరు త్రాగటంవల్ల అతను కొద్దిగా అనారోగ్యము పాలయ్యాడు.

UNWELL : శరీరంలో లేదా మనస్సు బాగా లేకపోవడం
He was *unwell* that is why he didn't to for office.
అతను అనారోగ్యంగా ఉన్నాడు. అందుకే ఆఫీసుకు వెళ్ళలేదు.

142. SYMPATHY : సానుభూతి
People have *sympathy* on the defeated leader.
ఓడిపోయిన నాయకుని మీద ప్రజలకు సానుభూతి ఉంది.

PITY : బాధ
His poverty is making everybody *pity.*
అతని బీదరికం అందరికి జాలి కల్గిస్తోంది.

143. STEAL : దొంగిలించు
It is easy to *steal* a bank for those thieves.
బ్యాంకును దొంగిలించడం ఆ దొంగలకు చాలా తేలిక.

ROB : దోపిడీ
The decoits *robbed* entire wealth of the rich man.
బందిపోట్లు ధనవంతుని సంపదనంతా దోపిడి చేశారు.



144. TRANSITIONAL : మార్పునకు మధ్య కాలం
In the *transitional* perioc many people were un-sheltered.
మార్పుకు మధ్యకాలంలో చాలామంది నిరాశ్రయులయ్యారు.

TRANSITORY : తాత్కాలికమైనవి
Troubles are *transitory*.
కష్టములు తాత్కాలికమైనవి.



145. VACANT : ఖాళీ అగు
Music teacher post is *vacant* in our school.
మా పాఠశాలలో సంగీత ఉపాధ్యాయుని పదవి ఖాళీగా వుంది.

EMPTY : శూన్యం, ఉత్త
The box is *empty*.
పెట్టె ఉత్తగా ఉంది.

146. VALUE : విలువ
*Value* of gold ornaments is high.
బంగారు ఆభరణముల విలువ ఎక్కువ.

PRICE : ధర
Tell the *price* of rice.
బియ్యం ధర ఎంతో చెప్పండి.

RATE : వెల
*Rate* of this book is 10 rupees.
ఈ పుస్తకం వెల పది రూపాయలు.

147. VALUELESS : విలువలేని
Discussing on *valueless* things is a waste.
విలువలేని విషయములపైన చర్చించుట దండుగ.

INVALID : పనికిరాని, అనర్హమైన
His answer papers were *invalid* due to copying.
కాపీ కొట్టిన కారణంగా అతని జవాబు పత్రములు అనర్హమయ్యాయి.



148. WISH : ఆకాంక్ష
I *wish* you all the best.
నీకు అంతా మంచి జరగాలని ఆకాంక్షిస్తున్నాను.

WANT : కోరిక
I *want* to fly in the air.
నీకు అంతా మంచి జరగాలని ఆకాంక్షిస్తున్నాను.

DESIRE : కోరిక
The day has come when my *desire* is full filled.
నా కోరిక తీరే రోజు వచ్చింది.

149. WOE : దుఃఖపూరితమైన
Her story is a *woe.*
ఆమెది ఒక దుఃఖపూరితమైన గాథ.

REGRET : విచారించు, విచారకరమైన
I *regret* to say that you did not get the job.
నీకు ఉద్యోగం రాలేదని చెప్పడానికి విచారిస్తున్నాను.

GRIEF : బాధ (సంఘటన వల్ల)
*Grief* of earthquake is not yet subsided.
భూకంపపు బాధ ఇంకా తగ్గలేదు.

ANGUISH : తీవ్రమైన బాధ
She was in *anguish* of her father's death.
ఆమె తన తండ్రి మరణానికి తీవ్ర బాధలో ఉంది.

150. WILLFUL : మొండి
She is a *willful* girl.
ఆమె మొండి పిల్ల.

WILLING : యిష్టపడు
Ravi is *willing* to play cricket.
రవి క్రికెట్ ఆడటాన్ని ఇష్టపడుతున్నాడు.

